పార్టీల పోకడలు

ఈ రాజకీయ పార్టీలు మనకు స్వరాజ్యం వచ్చినా లాభం లేకుండా చేస్తున్నవి. ప్రతి పార్టీకి ప్రజా క్షేమమే లక్ష్యం. దాని సాధనకు ప్రతి పార్టీకి ఒక విధానం, కార్యక్రమం ఉంటాయి. కాని వాటిని అమలు జరపాలంటే మొట్టమొదట తనకు ప్రభుత్వాధికారం కావాలని ప్రతి పార్టీ కోరుతోంది. అందుచేత అధికారం కొఱకు పార్టీలమధ్య ఎడతెగని పోటీ బయలు దేరింది. ఏ పార్టీ అధికారంలోనికి వచ్చినా దానికి అడ్డు తగలడమే ఇతర పార్టీల పనిగా ఉంది. దీనికి కేరళ పరిస్థితి నిదర్శనం. పార్టీ ప్రభుత్వవిధానంలో అధికారవ్యామోహం ముందుకు వచ్చి, ప్రజా క్షేమం వెనుకకు పోతోంది. మీదు మిక్కిలి ఎలాగో ఒకలాగ అధికారం సంపాదించడానికిగాను ఆశ్రిత పక్షపాతాన్ని పార్టీలు అవలంబిస్తున్నవి. ప్రజలలో చీలికలు తెచ్చి, కక్షలు పెంచుతున్నవి. వీటన్నింటి వలన అవినీతి పెరుగుతోంది. అందుచేత పార్టీలతో ప్రజలు విసుగెత్తి పోతున్నారు. ఫ్రాన్సులోను, పాకిస్తానులోను పార్టీ ప్రభుత్వాల్ని తోసివేసి సైనిక నియంతృత్వాలు ఏర్పడ్డాయి. నియంతృత్వాలలో ప్రజల సమస్యలు చాలాభాగం పరిష్కరింపబడినా, స్వేచ్ఛ సన్నగిలుతుంది. దూరాలోచనతో చూస్తే, మానవులకు ఆహారంతోపాటు స్వేచ్ఛ కూడా కావాలి. మరియు నాగరికత పెరుగుతున్నకొద్దీ ఒక మనిషితో ఇంకొకరు సహకరిస్తారే కాని లొంగిఉండడానికి ఒప్పుకోరు. అందుచేత రానురాను నియంతృత్వాలకు అవకా

కం తగ్గిపోతోంది. రష్యా, పాకిస్తానులలో అధికార వికేంద్రీకరణ మార్గాలను అవలంబిస్తున్నారు. కనుక ఆహారం, స్వేచ్ఛ కలిసివచ్చే ప్రభుత్వవిధానం ఏదేనా ఉందా అని పరిశీలించాలి.

### ప్రజలు — ప్రభుత్వం

ఏ విధమైన ప్రభుత్వం ఉన్నా ఏదో కొంత అన్యాయం, అధికార దుర్వినియోగం తప్పదు కనుక, అసలు ప్రభుత్వమే లేకుండా ప్రజలు తమ సమస్యల్ని తామే సవరించుకోవడం ఉత్తమమని సర్వోదయ పద్ధతి. దీనిబట్టే భూదాన ఉద్యమం నడిచింది. కాని ఇటువంటి పద్ధతి వల్ల కొద్ది మంది కొన్ని సమస్యల్నే తాత్కాలికంగా సరిదిద్దగలరని అనుభవంలో నేడు ఋజువవుతోంది. ప్రజా సమస్యల్ని విశాలంగాను, స్థిరంగాను పరిష్కరించాలంటే అది ప్రభుత్వ వ్యవస్థ ద్వారానే జరగాలి. అందుచేతనే భూదానోద్యమం కూడా చివరికి ప్రభుత్వ చట్ట సహాయాన్ని ఆశిస్తోంది. దీని బట్టి ఒక వైపున తాత్కాలిక ప్రయోజనాల కోసం వ్యక్తిగత సానుభూతిని కోరినా, ప్రభుత్వ సంస్థను మాత్రం నిర్లక్ష్యం చేయలేము.

ఇంతకీ ప్రభుత్వం అంటూ ప్రజలకు భిన్నంగా లేదు; ప్రజల సహకారం లేనిదే శాసనాలు అమలు జరగవు. మనం పన్నులు ఇవ్వకపోతే ప్రభుత్వానికి సొమ్ము లేదు. ప్రభుత్వపు విరాళాలు అంటే మనం చెల్లించిన పన్నులలోని భాగాన్నే మనకు తిరిగి ఇస్తోంది. ఇట్లా ప్రతి ప్రభుత్వ విధానం ప్రజల మీదనే ఆధారపడి ఉంది కనుక ఒక విధానం మనకు క్షేమకరంగా లేకపోతే దానిని ఇంకొక రీతిలోనికి మార్చుకునే హక్కు, శక్తి, విధి మనకు ఉంది.

ప్రభుత్వంద్వారా పనులను నెరవేర్చుకొనుటే పౌరుల ధర్మము. అట్లుకాకుండా ఒకవైపున ప్రభుత్వానికి పన్నులు చెల్లిస్తూ, రెండవ వైపున తమ పనులు తామే చేసుకుంటే, నౌకరుకు జీతం ఇస్తూ యజమాని తన పనులను తాను చేసుకొనే అవివేక మవుతుంది. రాజకీయ చైతన్యం లేకుండా ఇట్టి అవివేకములో సామాన్య ప్రజలు పడిఉండుట చేతనే ప్రజలు కూటికీ-గుడ్డకూ కరువై బాధపడుతూ ఉండగా వారి నౌకర్లగు ఉద్యోగస్తులూ, మంత్రులూ భోగభాగ్యాలతో విలాసాలు అనుభవిస్తున్నారు. ఇట్టి అసందర్భ పరిస్థితిని సరిదిద్దాలంటే ప్రజలలో రాజకీయ చైతన్యం పెంచవలెను. ప్రజలే ప్రభువులు, ప్రభుత్వ సంస్థ ప్రజల నౌకరు అను విషయము స్పష్ట పరచవలెను. అందరి ప్రజలకు జీవిత సౌకర్యాలు, శాంతి-సౌఖ్యాలు చేకూర్చగలుగు విధానమును ఏర్పరుచు బాధ్యత ప్రభుత్వానిది. ప్రభుత్వము ఆ విధిని నెరవేర్చునట్లు చూచుటే ప్రజల విధి. నేటి రాజకీయ పార్టీలు ప్రజలకు, ప్రభుత్వానికి మధ్య దళారులుగా వ్యవహరిస్తూ ప్రజలను తమ విధి నుండి మరిపింప జేస్తున్నాయి. ఈ దళారులను తొలగించి మనమే సక్రమ ప్రభుత్వ విధానాన్ని ఏర్పరుచుకోవాలి.

## పార్టీ రహిత ప్రజాస్వామికము

పార్టీ విధానం పనికి రాదు. నియంతృత్వం వద్దు అనుకుంటే, అందరికీ అన్నవస్త్రాలు, స్వేచ్ఛా సౌఖ్యములు ఇవ్వగలిగింది పక్షరహిత ప్రజాస్వామికం. ఇందులో ఎన్నికలు ఉంటాయి. కాని వ్యక్తుల శక్తి సామర్థ్యాల బట్టి ఓటు వేస్తారు గాని పార్టీ తత్వాల బట్టి కాదు. పార్టీ టిక్కెట్లు ఉండవు; ఉంటే అవి నిరసింపబడుతవి. ఎన్నికయిన సభ్యులంతా ప్రజాప్రతినిధు

లుగానే ఎంచ బడతారు. ఈనాడు వారిని పార్టీ ప్రతినిధులుగా భావించడం చేత వారు శాసన సభలో పార్టీ బ్లాకులలో గ్రూపులుగా కూర్చుంటారు. ఈ బ్లాకులు అధికార పార్టీకి అనుకూలం, ప్రతికూలంగా విడిపడుతవి, బ్లాకుల్లో ఉన్న ఈ ఐదేళ్ళు తమ వారు చెప్పింది అవును, ఎదుటి వారు చెప్పింది కాదు అని గుడ్డిగా అనడమే వీరి పని. విషయంలోని బాగో గులు, ప్రజల గురించి ఆలోచనకు ఇందులో తావు లేదు. ప్రజా క్షేమం కంటే పార్టీ ప్రాబల్యం వీరికి ముఖ్యం. ఇటువంటి పార్టీ సంప్రదాయాన్ని పార్టీ రహిత ప్రజాస్వామిక విధానం మార్చి వేస్తుంది పార్టీ బ్లాకులను రద్దు చేస్తుంది. అందరు శాసన సభ్యులు ప్రజాప్రతినిధులేగాని పార్టీ ప్రతినిధులు కారు. అందరికీ ఓటు స్వేచ్ఛ ఉంది. ప్రతి విషయం యొక్క బాగో గుల బట్టి ఇటూ-అటూ ఓటు వేస్తారు. అధిక సంఖ్యా ఓటుతో ఎప్పటి కప్పుడు తీర్మానాలు చేస్తారు. అందరూ ప్రజలచే ఎన్నుకోబడిన దొడ్డవారే కనుక అందరూ కలిసి చేసిన ఆలో చన పాక్షిక స్వార్థ దృష్టితో కాకుండా ప్రజా క్షేమకరంగానే ఉంటుంది. సభ్యులందరి యొక్క పరస్పర సంప్రదింపుల వల్ల ఎప్పటి కప్పుడు అసలు ప్రజాభిప్రాయం శాసన సభలో ప్రతి బింబిస్తుంది.

ముఖ్యమంత్రిని శాసన సభ్యులందరూ కలిసి ఎన్నుకుం టారు. సమర్థుల్ని ఆయన ఇతర మంత్రులుగా నియమించు కుంటారు. అయినప్పటికీ మంత్రులు చెప్పిందల్లా శాసన సభ అంగీకరించ నక్కరలేదు. మంత్రుల సూచనలను సభ్యులు స్వేచ్ఛగా సవరించ వచ్చును.

## లాభనష్టాలు

పార్టీ కట్టుదిట్టాలు ఉండబట్టి శాసన సభ్యులు అదుపు ఆజ్ఞలలో ఉంటున్నారుగాని, పార్టీలు తీసివేస్తే విచ్చలవిడిగా సభ్యులు స్వార్థం వైపు పోరా అను అనుమానం పార్టీరహిత ప్రజాస్వామికం గురించి కలుగవచ్చు. కాని అట్లు జరగదు. నేడు పార్టీలు ఉండుట చేతనే వాటి అండను చూచుకొని సభ్యులు అశ్రద్ధగా ఉంటున్నారు. ఓటింగు సమయం అప్పుడు తప్ప సాధారణంగా శాసన సభలోనే హాజరు కావడం లేదు. అట్టి శాసనసభ్యులపై ఒత్తిడి తీసుకురావాలంటే, పార్టీ తత్వాలు అడ్డుపడి తమ తమ సభ్యుల్ని సమర్థించి కాపాడుచున్నవి. పార్టీలు తీసివేస్తే ప్రతి శాసన సభ్యుడు ప్రజల విమర్శకు సూటిగా గురిఅయి జాగరూకతతో సంచరిస్తాడు. ఈనాడు ఉన్న పార్టీతత్వాలవల్ల తమ తమ ప్రతినిధులపై ఒత్తిడి తెచ్చు హక్కును ప్రజలు వినియోగించుకొనుట లేదు. అందుచేతనే ఈనాటి స్వతంత్ర శాసన సభ్యులు విచ్చల విడిగా ప్రవర్తించుటకు అవకాశం ఉంది. కాని పార్టీలు రద్దు చేసినట్లయితే ప్రజలలో మెలుకవ కలిగి తమ తమ ప్రతినిధులను తాము అదుపు ఆజ్ఞలలో ఉంచుకొనగలరు. ప్రజలలో ఇట్టి చైతన్యం పెంపొందుటే ప్రజాస్వామికానికి బలము. కాని ప్రజకు ప్రతినిధికి మధ్య దళారిగా నిలుచొని ఈ చైతన్యాన్ని పార్టీలు పెరగనివ్వడం లేదు.

ప్రజలు రాజకీయంగా చైతన్యవంతులు కాగలిగిన నాడు నమ్మిక ప్రజాస్వామికానికి పునాది. కాని అటువంటి చైతన్యం ప్రజలందరికీ అసాధ్యం, అది కొంతమందిలోనే ఉంటుంది అనుకోవడం పెత్తందారీ విధానం. ఈ పెత్తందారీ విధానమే

పార్టీతత్వాలకు పునాది. అది అంతకంతకు నియంతృత్వాలకు దారి తీస్తుంది. ఈనాడు ఏదయితే పార్టీ ప్రజాస్వామికం అనుకొంటున్నామో, అది నిజానికి, మెజారిటీ పార్టీ నియంతృత్వం. ఎందుకనగా ఏ పార్టీకయితే మెజారిటీ ఉంటుందో అది మైనారిటీ పార్టీలను నిర్లక్ష్యం చేస్తున్నది. అందుచేత ఈ నియంతృత్వ పోకడలను తీసివేయాలంటే పార్టీలను రద్దు చేయాలి. దానితో పాటు ప్రజాస్వామిక చైతన్యం కూడ ప్రజలలో పెరుగుతుంది.

ఒక్కొక్క పార్టి ఒక్కొక్క వర్గ చైతన్యానికి ప్రాతినిధ్యం వహిస్తుంది అనుకోవడం కూడా పొరబాటు. అసలు ప్రజలలోని ధనిక తత్వాన్ని వర్గాలుగా విభజించ వచ్చా, లేదా అను మూల సిద్ధాంతాన్ని ఇప్పుడు ప్రశ్నించకపోయినా ఒక పార్టి పేరుమీద ఎన్నికయిన వారు ఇంకొక పార్టీలోకి మారడం చూస్తూ ఉంటే పార్టి పేరుకు ఒక వర్గపు ప్రాతినిధ్యం ఇవ్వడం నిరాధారమైనదని ఋజువు అవుతున్నది.

ఏ శాసన సభ్యుడయినా పార్టీతత్వంలో ఉంటే తన నియోజక వర్గానికి పూర్తిగా ప్రాతినిధ్యాన్ని వహించ లేకున్నాడు. ఆ నియోజక వర్గములో తన పార్టి వారికే అనుకూలముగా ఉండి, ఇతరులకు వ్యతిరేకుడు అవుతున్నాడు. ఇది ప్రజాస్వామిక సూత్రాలకే విరుద్ధం. శాసన సభ్యులంతా స్పీకరును ఎన్నుకుంటారు. ఆ స్పీకరు ఇదివరలో ఏ పార్టీకి చెంది ఉన్నా, ఎన్నిక తర్వాత తన పార్టితత్వాన్ని విడనాడి, నిష్పక్షపాతబుద్ధి కలిగి ఉండాలని శాసన సభ సాంప్రదాయం. ఆ విధముగానే నియోజక వర్గానికి ప్రతినిధి ఎన్నికయిన తర్వాత

నిష్పక్షపాతబుద్ధితో ఉండ వద్దా. అట్లుకాక ఒక పార్టితత్వముతో శాసన సభలో వ్యవహరించుట తన నియోజక వర్గానికి అన్యాయం చేయుట కాదా? మరియు రాష్ట్ర పరిపాలనను నిష్పక్షపాత బుద్ధితో కొనసాగించ వలసిన మంత్రులు ఒక పార్టి బ్లాకుకు చెందినట్లయితే పరిపాలనలో పక్షపాతం వచ్చి తీరుతున్నాది. ఇది ఏంతో అవినీతికి దారి తీస్తున్నాది. పార్టీ బ్లాకులను రద్దు చేస్తే తప్ప ఈ అన్యాయాలన్నీ పోవు.

మనుష్యులయిన తర్వాత భిన్న భిన్నాభిప్రాయాలు ఉంటాయి. అందులో తప్పు లేదు. కాని శాసనసభ్యత్వం ఉన్నంత కాలం ఒక బ్లాకులో కూర్చుని ఇంకొకరికి అనుకూలంగానో, వ్యతిరేకంగానో ఐదు సంవత్సరాలూ వ్యవహరించడం అంటే అది తప్పు. అభిప్రాయాలను మార్చుకోవడానికి అవకాశం ఉండాలి. ఇటువంటి సామరస్య భావం, సర్దుబాటు లేకపోతే అది ప్రజాస్వామికము కానే కాదు. పార్టి బ్లాకులు ఈ సామరస్యానికి అడ్డుపడుతున్నాయి. అందుచేత పార్టీల ఉనికి ప్రజాస్వామికపు మూల సూత్రానికే విరుద్ధం. శాసన సభలోని పార్టి బ్లాకులను రద్దు చేస్తే తప్ప ఇది ప్రజాస్వామికం కానేకాదు. పార్టీల వల్ల ప్రజాస్వామికము పార్టీస్వామికముగా రూపొంది అంతకంతకు ఏదో ఒక రకమైన నియంతృత్వానికి దారి తీస్తున్నాది. ప్రజాస్వామ్యాన్ని పరిరక్షించాలంటే వెంటనే పార్టి బ్లాకులను రద్దు చేయ్యాలి.

# కార్యక్రమం

మన రాజ్యాంగ చట్టంలో పార్టీల ప్రసక్తి ఎక్కడా లేనే లేదు. రాజ్యాంగ చట్టంలోని 75, 164 సెక్షనుల ప్రకారం కేంద్రంలోనూ, రాష్ట్రాలలోనూ ప్రధాన మంత్రిని, ముఖ్యమంత్రులను ప్రెసిడెంటు, గవర్నర్లు నియమించవలెననే ఉన్నది కాని మెజారిటీ పార్టీ లీడరును నియమించవలెనని ఎక్కడా లేదు. ఈ సెక్షనుల ప్రకారం అసలు శాసన సభ్యునిగా లేని వానిని కూడా ముఖ్యమంత్రిగా నియమించ వలెనని ఎక్కడా లేదు. ఈ సెక్షనుల ప్రకారం అసలు శాసన సభ్యునిగా లేని వానిని కూడ ముఖ్యమంత్రిగా నియమించ వచ్చును. 1952 లో రాజాజీని మద్రాసు రాష్ట్ర ముఖ్యమంత్రిగా గవర్నరు నియమించడం ఇందుకు నిదర్శనం. మరియు శాసనసభ రికార్డులలో సభ్యుల పేర్ల ఎదుట వారి వారి నియోజక వర్గాలు వ్రాస్తారు గాని వారి వారి పార్టీలు వ్రాయరు. అయితే రాజ్యాంగ చట్టం 105 వ సెక్షనులో బ్రిటీషు పార్లమెంటు సాంప్రదాయాన్ని మనం అనుసరించ వచ్చునని ఒక సూచన ఉంది. మనం క్రొత్త సాంప్రదాయాలను పెట్టుకోవడానికి కూడా ఆ సెక్షనులోనే అవకాశం ఉంది. బ్రిటనులోను, అమెరికాలోను వారి వారి ఆర్థిక, రాజకీయ సామ్రాజ్యతత్వాలవల్ల వారికి ఆర్థిక సమృద్ధి ఉంది. వారిని పీడించే సమస్యలు హెచ్చు లేవు. అందుచేత వారు పార్టీలు పెట్టుకున్నా వారికి ఇబ్బంది లేదు. అయినప్పటికీ రెండవ ప్రపంచయుద్ధ సమయమున బ్రిటీషు పార్లమెంటులో ఉన్న రెండు ముఖ్య పార్టీలను కలిపివేసి ఒకే మిశ్రమ మంత్రివర్గమును ఏర్పరచారు. అనగా క్లిష్ట సమయములో వారికి కూడా పార్టీతత్వం పనికి రాలేదు. భారత దేశములో ఉన్న ఆర్థిక సాంఘిక పరిస్థితులు శాంతి సమయంలో కూడా క్లిష్ట సమస్యలను తయారు చేస్తున్నాయి. అందుచేత మనకు పార్టీలు పనికి రావు. పాకిస్తాను అభివృద్ధికి పార్టీలు అడ్డుపడుట చేతనే వాటిని రద్దు చేసి సైనిక నియంతృత్వం అక్కడ ఏర్పడింది. మనకు నియంతృత్వం వద్దనుకుంటే

ప్రజాస్వామికాన్ని పోషించడానికి గాను పార్టీ బ్లాకులను రద్దుచేసి పార్టీ రహిత ప్రజాస్వామికాన్ని ఏర్పర్చుకోవాలి. ఇందుకై సాంప్రదాయాన్ని మార్చుకోవడమే గాని చట్టమేమీ అడ్డుపడదు.

పార్టీ సాంప్రదాయాన్ని మార్చి పార్టీ రహిత ప్రజాస్వామికం నిర్మించుకొనుటకు ఒక వైపున ప్రజలలో విరివిగా ప్రచారం చేస్తూ రెండవ వైపున వెంటనే పార్టీ బ్లాకులను రద్దు చేయమని శాసన సభపై ప్రజా ఒత్తిడి తేవాలి. ప్రతి నియోజకవర్గములోనూ సంతకాలు సేకరించి, సభలు జరిపి, తమ తమ ప్రతినిధులు పార్టీ బ్లాకులు విడనాడవలెనని కోరవలెను. ఇట్లు చేసినట్లయితే దీని ప్రభావం ఒక్క శాసన సభలోనే కాక మునిసిపాలిటీలు, పంచాయితీ బోర్డులపైన కూడ పడగలదు.

ఒక వైపున ఇటువంటి ప్రచారం వల్ల ప్రతినిధులపై ఒత్తిడి వెంటనే తెస్తూ రెండవ ప్రక్క రాబోవు ఎన్నికలలో పార్టీ టికెట్లు గల ఏ ప్రతినిధికీ ఓటు వెయ్యరాదని విరివిగా ప్రచారం చెయ్యవలెను. దీని వలన సరియగు ప్రజా చైతన్యం కలుగును. అప్పుడు. సమర్థులు, ప్రజాసేవా దృష్టి గల వ్యక్తులే ఎన్నిక అగుటకు అవకాశం లభించును. అటువంటి ప్రతినిధులతో కూడిన శాసన సభ ప్రజల యొక్క ఆర్థిక, సాంఘిక సమస్యలను సమర్థతతోను, నిష్పక్షపాత దృష్టితోను పరిష్కరించ గలదు. అప్పుడే ప్రజలందరికి ఆహారం స్వేచ్ఛ కలిసి వస్తాయి. అందుచేత పార్టీ రహిత ప్రజాస్వామికాన్ని ఎంత త్వరలో స్థాపించుకుంటే అంత త్వరలో మనం సౌఖ్యం పొందుతాం.